Registered No. M-4345

# యుద్ధ సంచిక.

వాల్యుం II.] 1942 వ సం॥ మే నెల 22 వ తేది శుక్రవారం [నె 20 రు.



## మద్రాసు రాష్ట్రంలో సైనిక సన్నాహములు.

### వైస్రాయిగారి సందేశము.

ఇండియా గవర్నరు జనరలుగారైన లినులితుగో ప్రభువుగారు మద్రాసు రాష్ట్రప్రజలనుద్దేశించి ప్రత్యేకం యీ క్రింది విధముగా ఒక సందేశమును ప్రకటించారు :—

ముమ్ముందు భారతదేశానికి కష్టాలున్నూ చాలా ఆందోళనయున్నూ కలిగేటట్లుగా కన్పిస్తోంది. మద్రాసు రాష్ట్రమును రక్షించుటకు చేయవలసిన యుద్ధ సన్నాహములన్నియు సరిగా చేయబడుచున్నవో లేదో తెలిసికొనుటకొరకై నేను మద్రాసు నగరమునకు వచ్చాను. ఈ సైనిక సన్నాహములన్నీ చేయుచున్నవారితో స్వయంగా కలిసికొని మాట్లాడుటకొరకున్నూ, మద్రాసు రాష్ట్రవాసులతో నాకుగల స్నేహభావమును యీ ఆపత్సమయంలో తిరిగీ బలపరచుటకున్నూ నేను మదరాసు నగరం వచ్చాను. నేను చాలా దినములు మద్రాసులో మకాముచేయుటకు అవకాశం లేకపోయింది. కాని మదరాసు ప్రజలు యెక్కువ స్నేహభావమును చూపుతున్నారనే సంతృప్తి నాకు కలిగింది. జపానువారివల యీ మద్రాసు రాష్ట్రమునకు అపాయము కలుగకూడదనియే నేను కోరుచున్నాను. కాని యుద్ధం చేయవలసిన సమయంవస్తే వీరందరూ తమ తమ విధ్యుక్త ధర్మములను తప్పకుండా నెరవేర్చగలరనే గట్టి నమ్మకము నాకు కలిగినది.

ఈ రాజధానిలో చేయబడిన రక్షణ సన్నాహముల నన్నింటిని యీ స్వల్ప వ్యవధిలో నేను పరిశీలించి చూచాను. ఈ సన్నాహములు దిన దిన ప్రవర్ధమానంగా ఉన్నాయి. ఈ ఏర్పాటులన్నీ స్వయంగా చూస్తే మీ కందరికీ ఆ విషయం బోధపడగలదు. ఈ సైనిక సన్నాహములకు సంబంధించిన వేర్వేరు శాఖలకు పరస్పర సంబంధంకూడా చాలా అధికమవుతూనే ఉంది. అన్యోన్యంగా అంతకంతకు ఎక్కువ కలిసిమెలసి పనిచేస్తున్నారు. ప్రజారక్షణార్థమైన ఏ. ఆర్. పి. (విమాన దాడి రక్షణ) శాఖల ఏర్పాట్లు చాలా ప్రశస్తంగా ఉన్నాయి.

ఈ రాష్ట్రంలో అనేక పటాలములను అనేక ప్రాంతాలలో నేను చూచాను. ఈ పటాలముల

లోని వారందరూ, మంచి ధైర్యస్థైర్యములను, చాకచక్యమును కలిగియున్నారు. ఈ పటాలములన్నియు శత్రువులను అడ్డగించుటకు అభేద్యమైన కోటగోడలవలె నిలువగలవు. ఈ పటాలములను చూచుటవల్ల నాకు చాలా సంతృప్తికలిగింది.

మద్రాసు రాష్ట్రంలో యుద్ధసాధన పరికరములు మొదలైనవి ఎక్కువగా తయారుచేయబడుచున్నవి. ఈ ఆయుధ సాధనోత్పత్తి ఇంకా ఎక్కువయగుటకు చాలా అవకాశాలు ఉన్నాయి. ఈ యుద్ధావసర సామగ్రులను ఉత్పత్తిచేయుటలో ప్రజలు ఇంకా పని సాగించుచుండవలెనని నేను కోరుచున్నాను.

ఈ విధంగా ప్రజలందరూ దేశరక్షణ కార్యములలో నిమగ్నులై పనిచేసినయెడల, యుద్ధరంగంలో పోరాడేటటువంటి మన సేనలకు చాలా సహాయంచేసిన వారవుతారు.

ఈ సమయంలో ప్రజలందరూ ఏకాభిప్రాయులై సమాన సంకల్పంతో వ్యవహరించడం చాలా అవసరం. ప్రజలందరూ స్థిరసంకల్పంతో ఉన్నారని శత్రువులుకూడా గ్రహింపగల్గుతారు. కనుక ప్రజలందరూ అట్టి పద్ధతిగా వ్యవహరించవలెను.

మద్రాసు గవర్నరుగారు మీకు సకలవిధముల ప్రోత్సాహమును కలుగజేయుచుండగలరు. మీరందరూ మీ విధ్యుక్త ధర్మములను నిర్వహిస్తూ ఉండవలెనని నేను కోరుచున్నాను. ఈ సమయంలో మీరందరూ మీదేశమును మీ సొత్తును కాపాడుకోవలసియున్నారు. ఈ విషయము మీకు అందరికీ తెలిసినదే. భారతమాత మనలనందరినీ తనకొరకై సేవజేసి త్యాగం చేయవలసినదని ఆహ్వానిస్తోంది. కనుక ఈ సమయంలో మనము పిరికిపందలము కాగూడదు. భారతదేశీయులందరూ ఏకీభవించి దేశరక్షణమునకు సంసిద్ధము కావాలి. ఒకప్పుడు మద్రాసు రాష్ట్రములోని వీరాగ్రేసరులు జగద్విఖ్యాతిని పొందియున్నారు. మీరును వారి సంతతివారే. కనుక నా విజ్ఞాపనను వ్యర్థము చేయరని నేను ఆశాభరితుడనై యున్నాను.

---

# వైస్రాయికి మద్రాసు గవర్నరుగారి ప్రత్యుత్తరం.

మద్రాసు గవర్నరుగారు యీ క్రింది రీతిగా వైస్రాయికి ప్రత్యుత్తర మొసంగిరి :—

ఈ మద్రాసు రాష్ట్రవాసుల నుద్దేశించి మీరు ఉదారభావంతో ఉత్సాహమును పురిగొల్పెడి యీ సందేశమును ప్రకటించినందుకు మద్రాసు రాజధాని ప్రజలందరి పక్షమున నేను మీకు కృతజ్ఞతాపూర్వక వందనము లాచరించుచున్నాను. మద్రాసు మీదకు శత్రువులు వచ్చినయెడల, మద్రాసు రాష్ట్రములో శత్రువును తగినరీతిగా ఎదిరించగల్గుటకు చేయవలసిన ఏర్పాటులన్నియు, మీరు స్వయంగా అజమాయిషీ చేయుచున్నారనే గట్టి నమ్మకము ప్రజలకిప్పుడు కలిగింది. ఈ రాష్ట్రములోని ప్రజలందరూ మనకు విజయము కలిగే వరకూ మన సేనలకు సహాయంచేయుచుండగలరని నేను స్థిరాక్షరంగా నొక్కి వక్కాణించగలను. ఈ విషయంలో ప్రజలందరును దీక్షాబద్ధులై యున్నారని నేను గట్టిగా చెప్పగలను.

---

# భారతదేశంలో ఔషధ ద్రవ్యాభివృద్ధి.

ఇప్పుడు ఇండియాలో కావలసిన ఔషధ ద్రవ్యములలో నూటికి 65 వంతువరకు ఇండియాలోనే తయారవుతున్నవి. యుద్ధానికి పూర్వము నూటికి 25 వంతువరకు మాత్రమే ఇండియాలో తయారగుచుండెను.

ఇదివరలో విదేశాలనుంచి ఇండియాలోనికి ఎగుమతి యగుచుండిన ఔషధ ద్రవ్యములలో 350 రకములకు పైగా ఇండియాలోనే, ఇండియాలో లభించెడి మూలికలవల్లనే, గవర్నమెంటు మెడికలు స్టోర్సు డిపోలో తయారు చేయబడుచున్నవి. ఇదివరలో విదేశాలనుండి దిగుమతి యగుచుండిన ఔషధ ద్రవ్యములకు పెక్కింటికి బదులుగా వాటికి సమానమైన స్వదేశీయ ఔషధ మూలికా ద్రవ్యములు తయారుచేయబడుచున్నవి. 1940-41 వ సం॥లో ఇండియా మెడికలు స్టోర్సు డిపార్టుమెంటువారు యీ దేశంలో తయారయ్యే

# రష్యాను యుద్ధ రంగంలో



"టామీ ఫిరంగులు" (చేమర తుపాకులు) గల పటాలము రణరంగమునకు పోవుచున్నది.

ఔషధములను రూ. 104 లక్షల కిమ్మతుగల సరకును కొనుక్కొన్నారు. యుద్ధానికి పూర్వము కొనినటువంటి సరకుకంటె 6½ రెట్లు ఎక్కువ కిమ్మతుగల సరకును కొన్నారు.

శస్త్రచికిత్సలకు కావలసిన సాధన పరికరములున్నూ, వికలాంగలోప సంస్కరణ సాధనములున్నూ (అంగద తంత్ర పరికరములున్నూ) ఇండియాలోనే ఇప్పుడు ఎక్కువగా తయారగుచున్నవి. బ్రిటిష్ సామ్రాజ్యంలో చేరిన తూర్పు రాజ్యాలలోకెల్ల భారతదేశమే పై జెప్పిన సామగ్రులను అత్యధికంగా తయారుచేయుచున్నది. ఇండియాలో శస్త్ర చికిత్సలకు కావలసిన సామగ్రి యావత్తు సమగ్రంగా ఇండియాలోనే ఇప్పుడు తయారవుతోంది. అంగలోప సంస్కరణ సాధనములలో నూటికి 98 వంతు వరకు ఇండియాలో తయారగుచున్నవి. కాని, సునిశితమైన సూక్ష్మ యంత్ర సాధనములు కొన్ని మాత్రము ఇండియాలో తయారుకావడం లేదు. ప్రస్తుతం జరుగుచున్న సంవత్సరములో సైనిక శాఖవారికి సప్లయి చేయబడు నిమిత్తమై భారతదేశంలో 50 లక్షల శస్త్ర చికిత్సా సాధన పరికరములు తయారగుచున్నట్లుగా అంచనా వేయబడినది. శస్త్రములు చేయబడినవారికి కట్టు కట్టుటకు ఉపయోగపడునట్టి కట్టుగుడ్డ ఇండియాలోనే అపారంగా తయారగుచున్నది. ఇటీవల ఒక్కసారిగా ఒక్క ఆర్డరులో 120 లక్షల గజముల గుడ్డ శస్త్రచికిత్సలకొరకైన కట్టుగుడ్డగా తీసికొనబడెను. కట్లుకట్టుటకు ఉపయోగపడే దూది 120 లక్షల పౌనులున్నూ, దూది వేసిన మెత్తని గుడ్డ 16 లక్షల పౌనులున్నూ ప్రతి మాసము ఇండియాలో తయారుచేయబడుచున్నది. ఇండియాలోని ఒక్క మెడికలు స్టోరు ఫ్యాక్టరీలోనే మాసమునకు 10 లక్షల పౌనుల కట్టుడు సామగ్రి తయారగుచున్నది.

### యుద్ధావసరములు హెచ్చుట.

కాని, యింకను యుద్ధావసరములకు కావలసినంత సామగ్రి యింకా తయారగుటలేదు. భారతదేశము అనేక యుద్ధరంగములకు మధ్య కేంద్రస్థానంగా ఉంది. ఈ యుద్ధరంగములో క్షతగాత్రుల సంఖ్య ఎక్కువగానే యున్నది. రోజు రోజుకు హెచ్చుచున్నది. అందువల్ల ఇండియానుంచి సప్లయి కావలసిన ఔషధ ద్రవ్యముల పరిమితికూడా హెచ్చుచున్నది.

మధ్య ప్రాచ్యంలోను, పరిషియాలోను, ఇరానులోను, బర్మాలోను గల పటాలములకు యీ ఔషధ ద్రవ్యముల అవసరము ఎక్కువగా నున్నది. భారతదేశమే వాని నన్నింటిని సప్లయి చేయుచున్నది. చైనాకు క్వయినా విశేషంగా కావలెనని ఆర్డరు ఇవ్వబడినది. ఇదిగాక యితర వైద్య సామగ్రులుకూడా కావలెనని చైనా కోరినది. రెడ్‌క్రాసు సంఘమువారిద్వారా రష్యాకు 76,000 శస్త్ర చికిత్సా సాధన పరికరములు ఇండియానుంచి సప్లయి చేయబడెను.

ఇండియాదేశమధ్యంలోనే 8,540 సివిలు ఆస్పత్రులును, మిలిటరీ ఆస్పత్రులును కలవు. వీనికి అనుదినము కావలసిన ఔషధ సామగ్రులన్నియు ముఖ్యంగా సప్లయి కావలసియున్నవి. ఈ ఆస్పత్రులన్నియు బ్రిటిష్ యిండియాలో నివసించునట్టి 29 కోట్ల 70 లక్షల జనానికి వైద్య సహాయమును చేయవలసినవై యున్నవి. దేశంలో ఉన్న జనంగాక ఇతర ప్రాంతాలనుండి ఇండియాకు వచ్చుచున్న శరణార్థులకున్నూ యుద్ధ ఖైదీలకున్నుకూడా ఇండియాలో వైద్య సహాయము కావలసియుంటున్నది.

ఇది యిట్లుండగా, యీ దేశంలో శత్రు విమాన దాడులు జరిగి బాంబులు పడేయెడల, దేశంలో దెబ్బలు తగిలినవారి సంఖ్య ఎక్కువగా ఉండవచ్చును. ఈవిధంగా దెబ్బలు తగిలినవారి కందరికీ కావలసిన ఔషధ సాధనముల నన్నింటిని సమకూర్చి ఉంచుటకు సప్లయిలు ఇంకా ఎక్కువగా కావాలి.

### ప్రతిబంధకములు.

భారతదేశములో ఎంతవరకు సౌకర్యావకాశం కలదో అంతమేరకు సరుకు తయారవుతూనే ఉన్నది. కాని, ఈ సామగ్రిని ఇంకా అధికంగా తయారుచేయజాలకపోవుటకు కొన్ని ప్రతిబంధకములు కలవు. తగినంత యంత్ర సామగ్రి దేశంలో లేదు. కొన్ని రకాల ఔషధ సామగ్రులను తయారుచేయుటకు కావలసిన మూలికా ద్రవ్యములు ఇండియాలో లభించుట లేదు. కాని అమెరికా సంయుక్తరాష్ట్రముల ప్రభుత్వమువారు నానాటికి ఎక్కువగా సప్లయి చేయుచున్న యంత్ర సామగ్రి సప్లయివల్లను, ఇతర సప్లయిల సహాయమువల్లను, పైజెప్పిన లోపములుకూడా తొలగిపోగలవు.

---

# మిత్రమండలియొక్క నౌకా యుద్ధ తంత్రము.

కోరలు సముద్రమువద్ద (ఆస్ట్రేలియా సమీపమున) మొన్న నీ మధ్య జరిగిన నౌకా యుద్ధము చాలా గొప్పది. జపానువారు గొప్ప నౌకాదళమును తీసికొనివచ్చి యుద్ధము చేసారు. ఆ యుద్ధములో జపానువారివి (1) రెండు క్రూయిజర్లు, (2) విమానములను ఎక్కించుకొని పోగల విమాన వాహక నావలు రెండున్నూ, (3) రెండు డెస్ట్రాయరులున్నూ, (4) ఫిరంగులు గల చిన్న నావలు నాలుగున్నూ, (5) ఒక చిన్న క్రూయిజరున్నూ, (6) రవాణా నావలు మూడున్నూ ముంచివేయబడెను. ఈ నౌకాయుద్ధంలో జపానువారి నౌకా సైన్యంలో 4 వేలు మొదలు 5 వేలు వరకు జన నష్టం ఉండగలదు.

జపానువారి నౌకా బలము గొప్పది యని చెప్పుకొనుటకు కారణమేమనగా, జపానువారికి 9 పెద్ద యుద్ధ నావలు కలవు. జపానువారు నౌకా యుద్ధములలో క్రూయిజరులను మాత్రమే ఉపయోగించుచున్నారు. ఇంతవరకు జపానుకు 12 క్రూయిజర్లు నష్టమైనవి. ఇంకా 23 క్రూయిజర్లు మిగిలియుండగలవు. జపానుయొక్క యుద్ధరంగము బహు దూరసముద్ర ప్రాంతాలకు విస్తరించియున్నది. ఇట్టి సందర్భములో వారికి మిగిలియున్న క్రూయిజర్లు చాలవు. జపానుకు విమాన వాహక నావలు ఆరంభదశలో 9 కలవు. ఇప్పుడు మిగిలినవి 6 మాత్రమే.

జపాను ఇంకను అనేక నౌకా యుద్ధములను చేయవలసియున్నది. చాలా సముద్ర ప్రాంతమును తనవశమందుంచుకొనుటకు చాలా యుద్ధ నౌకాదళం జపానుకు కావాలి. పసిఫిక్కు మహాసముద్రంలో ముమ్ముందు జరుగవలసిన నౌకా యుద్ధంలో జపానువారి నావలు మరికొన్ని నష్టము కాగలవు. కనుక హిందూ మహాసముద్రంలో జపానువారు తమ నౌకాదళముతో దండయాత్రలను సాగింప బూనుకొనరు.

ఉత్తర ధ్రువ సముద్ర ప్రాంతములమీదుగా రష్యాకు అమెరికానుండి ఆయుధ సామగ్రులను

# కెనడానుంచివచ్చిన విమానాలు.



కెనడానుంచి ఇంగ్లాండుకు కొన్ని విమానదళములు పంపబడినవి. ఈ హడ్సను విమానములు ఇంగ్లాండుయొక్క కోస్తాలవెంట గస్తీ తిరుగుచు, శత్రు నావలను ధ్వంసంచేస్తూ, నీటమునిగిన నావలలోని జనులను రక్షిస్తూ గత రెండు మాసాలనుంచీ పనిచేయుచున్నవి. అనేక వేల మైళ్లు యీ విధంగా తిరిగిన ఒక కెనడా విమానదళమునకు యుద్ధ సేవ జేయుటలో రెండు మాసాలు పూర్తి యైనవి. ఈ పటములో అట్టి హడ్సను బాంబరు విమానమొకటి గస్తీ యాత్రకు ఎగిరిపోవుటకు సిద్ధంగా ఉన్నది. దీనిలో నలుగురు వైమానికులు ఎక్కవచ్చును.

---

చేర్చెడి నావల ముఠాలు రష్యాలోని మూర్మాంస్కు రేవుకు, ఆర్కేంజెలు రేవుకు పోవుచున్నవి. ఈ నావల ముఠాల వెంట అమెరికను యుద్ధ నావలు పోవుచున్నవి. సప్తసముద్రములలో అమెరికను యుద్ధ నావలు తిరుగుచున్నవని అమెరికా ప్రెసిడెంటయిన రూజువెల్టుగారు ఇటీవల అన్నారు. జపానువారు ఇటీవల విజృంభించి సముద్రమార్గములను అడ్డగించుచుండుట వల్ల మిత్రమండలియొక్క నౌకాదళము మూడు సముద్రములలో విస్తరించి పనిచేయవలసివచ్చినది. ఏదో ఒక సముద్రంలో ముందుగా నౌకాదళమునంతను కేంద్రీకరించి అక్కడ పని ముగిసిన తర్వాత మరొక సముద్ర ప్రాంతంలోనికి యీ నౌకాదళమును పంపించుటకు సందర్భ పరిస్థితులు వీలుగా లేవు. మూడు ముఖ్య సముద్రములలోను ఒక్క పర్యాయముగానే మిత్రమండలియొక్క నౌకాదళము మకాముగా ఉండవలసిన పరిస్థితు లేర్పడినవి.

అన్నింటికన్నా ముఖ్యముగా మధ్యధరా సముద్రములో మిత్రమండలియొక్క నౌకాదళము చేర్చబడవలసియున్నది. ఈ మధ్యధరా సముద్రంలో బ్రిటిష్ నౌకాదళము బలముగా నుండుటవల్లనే గడచిన కొన్ని మాసములలో ఇటలీయొక్క నౌకలు అనేకము మధ్యధరా సముద్రములో ధ్వంసం చేయబడెను. ఇతర సముద్ర ప్రాంతము లన్నింటికంటెను మధ్యధరా సముద్ర రంగము చాలా ముఖ్యమైనది.

ఇక రెండవది అట్లాంటిక్కు సముద్రము. అమెరికానుండి ఆయుధ సామగ్రులతో వచ్చెడి నావల ముఠాలను రక్షించుట చాలా అవసరము. నార్వే సముద్రతీరమువద్ద ట్రాండ్హేం ప్రాంతమున జర్మను నౌకాదళము చేరియున్నది. అమెరికా నుండియు, ఇంగ్లాండునుండియు ఉత్తర ధృవ సముద్ర ప్రాంతముమీదుగా రష్యాకు ఆయుధ సామగ్రులను చేర్చెడి నావల ముఠాలు రష్యాకు భద్రముగా పోవలసినవై యున్నవి. అందు కొరకై అచటి సముద్రమార్గములను బ్రిటిష్ యుద్ధ నావలు కాపాడుచుండవలెను.

ఇక మూడవది పసిఫిక్కు మహాసముద్రము. దానిలో చేరినదే హిందూ మహాసముద్రము.

అట్లాంటిక్కు సముద్రంలోను, మధ్యధరా సముద్రంలోను కొన్ని యుద్ధ నావలను ఉంచిన పిమ్మట పసిఫిక్కు మహాసముద్రములో మిగిలినవి చేర్చబడవలెను.

**మిత్రమండలి సాధించిన కొన్ని ఘన కార్యములు.**

మధ్యధరా సముద్రంలో 12,73,000 టన్నుల వెరశి ప్రమాణంగల ఇటాలియను నావలు ముంచివేయబడెను. ఇటలీ యుద్ధంలోకి దిగిన మొదటి 23 మాసాలలో అంత ఇటాలియను నౌకా నష్టము కలుగజేయబడెను. 1941 వ సం॥ మే మాసంలోనే సూయజు కాల్వను పట్టుకొనెదమని అక్షరాజ్యాలవారు అన్నారు. కాని, 1942 వ సం॥ మే నెల వచ్చినప్పటికీ, వారి మాట నెరవేరలేదు.

రష్యాకు చాలా ముఖ్యమైన ఆయుధ సామగ్రి చేర్చబడెను. వేలకొలది టాంకులున్నూ, విమానాలున్నూ ఉత్తర ధృవ సముద్రమార్గంమీదుగా చేర్చబడెను. సామగ్రులను తీసికొనిపోవుచున్న నావలను ముంచివేయవలెనని జర్మను విమానాలు దాడి వెడలెను. మొత్తం నావలలో నూటికి 10 వంతు మాత్రమే జర్మనులు ధ్వంసం చేయగల్గిరి. చాలా పర్యాయములు యీ నావల మురాలు నిరాటంకంగా రష్యా రేవులకు చేరినవి. మార్చి నెల 29 వ తేదిని ట్రినిడాడ్ అనబడు క్రూయిజరు ఆ నావల మురాలతో పోవుచుండగా ముంచబడెను. 'ఎక్లిప్సు' అనబడు డెస్ట్రాయరు చెడగొట్టబడెను. ఏప్రెలు 10 వ తేదిని ఎడింబరో అను క్రూయిజరు ముంచబడెను. ఇవి తప్ప పై జెప్పిన తేదీల మధ్య ఇతర నౌకా నష్టం ఏమిన్నీ లేదు. కాబట్టి ఆ తేదీల మధ్య రష్యాకు ఆయుధ సామగ్రులను తీసికొనిపోయిన యితర నావలన్నియు సురక్షితముగానే చేరెను.

ఆఫ్రికానుండి సింహళమునకు చాలా సేనలు చేర్చబడుచున్నవి. హిందూ మహాసముద్రంలోని మెడగాస్కరు అను ఫ్రెంచి దీవిని జపానువారు ఆక్రమించవలెనని యత్నించుచుండగానే బ్రిటిష్‌వారే దానిని ముందుగా ఆక్రమించిరి. పసిఫిక్కు మహాసముద్రంలో కోరలు సముద్రమువద్ద జర్గిగిన నౌకా యుద్ధంలో జపానువారి యుద్ధ నౌకాదళము చాలావరకు ధ్వంసం చేయబడెను. ఆస్ట్రేలియామీదకు దండెత్తవలెనని జపానువారు చేసికొన్న ఏర్పాట్లు భగ్నం చేయబడెను. అంతేకాకుండా జపానువారి నౌకాబలం కోరలు సముద్ర యుద్ధంలో దెబ్బ తినుటవల్ల, సముద్రంమీద విజృంభించుటకు జపానువారికి గల శక్తిసామర్ధ్యం కొంత క్షీణించినది.

# జపానుగ్రహ జపాలు.

కష్టకాలంలోనే ఎటువంటివాడికైనా బుద్ధి చలిస్తుంది. అటువంటి సమయంలోనే మంచి చెడ్డలను గ్రహించలేక మనుష్యులు మాయమాటలకు మోసపోతూ ఉంటారు. అయితే, "చెడ్డకాలంలో జరుగవలసిన కీడు మనకు జరుగక తప్పుతుందా?" అని కొందరు ప్రశ్నిస్తూ ఉంటారు. మన కర్మానుభవం మనకు తప్పుతుందా? అనే ప్రశ్నకు మన పూర్వులు ఇదివరకే జవాబు చెప్పియున్నారు. జపమువల్లను, తపమువల్లను, కర్మపాశమునుండి విముక్తి పొందవచ్చునన్నారు. "నీయొక్క ఆత్మనిగ్రహంవల్లనే, నీ దుష్కర్మ ఫలితములను నీయొక్క చెడ్డ యోగములను తప్పించుకొని, నిజమైన ముక్తిని ఆత్మశాంతిని నీవు పొందగలవు" అని పెద్దలు చెప్పియున్నారు. సరియైన జపతపమును చేయడంవల్లనే ఆత్మనిగ్రహం, ఆత్మశాంతి కలిగి, ఏవిధమైన పాతకములైనా సరే, మన చెంతకు రావు. "కృషితో నాస్తి దుర్భిక్షం—జపతో నాస్తి పాతకం"—కృషి అనగా వ్యవసాయంవల్ల కరవు అనేది ఉండదు - జపమువల్ల పాతకం అనేది ఉండదు.

ఈ యుద్ధ సమయంలో, యీ కష్టకాలంలో మనము పై జెప్పిన వ్యవసాయమున్నూ ఎక్కువగా చెయ్యాలి. సరియైన తారక మంత్రములను నిత్యనిధిగా, సదా సర్వకాల సర్వావస్థలయందున్నూ జపిస్తూ ఉండాలి. ఇప్పుడు ఇండియామీదకు జపానువాళ్లు దండెత్తి వస్తారనే భయం దేశంలో వ్యాపించింది. ఈ రోజువరకు ఆ భయం పోలేదు. ఈ భయం మూలంగా, దేశంలో అనేక వ్యాపార వ్యవహారాలు పాడైనాయి. కోస్తా ఊళ్లల్లో ఉండేవాళ్లు ఇళ్లు, వాకిళ్లు విడిచిపెట్టి, అరణ్యవాసం అజ్ఞాతవాసం చేసినట్లుగా, పరాయి ఊళ్లకువెళ్లి బంధువుల యిళ్లలోను, స్నేహితుల ఇళ్లలోను తలదాచుకొని

## బ్రహ్మాండమైన బ్రిటిష్ బాంబు విమానం.



ఇది "స్టర్లింగు" అనబడే బ్రహ్మాండమైన బ్రిటిష్ బాంబు విమానం. ఇది 4 ఇంజనులు గలది. రెండు ఇంజనులుగల "వెల్లింగుటను" అనే విమానంలో ఎంత బాంబుల సరకును ఎక్కించవచ్చునో అంతకు రెండింతలు బాంబుల సరకును యీ విమానం ఎక్కించుకొనగలదు. అంత బరువుతో అతి వేగంగా పోగలదు. శత్రు విమానములను ఎదిరించుటకు తగిన మరఫిరంగులుకూడా దీనికి కలవు. దీని క్రింది చక్రం ఒక్కొకటి ఒక మనిషి ఎత్తుగలది. ఇటీవల జర్మనీమీదకు యీ విమానాలు దాడీ వెడలినప్పుడు ఒక పెద్దజర్మను విమానదళమును ఎదిరించి రెండు స్టర్లింగు బాంబర్లు పోరాడినవి. 3 జర్మను విమానాలను పడగొట్టి నాల్గవదానిని చెడగొట్టినవి. ఈ పటంలో యీ బాంబు విమానంలో ఎక్కించుటకు నేలమీద బాంబులు సిద్ధంగా ఉంచబడినవి.

---

కాలం గడుపుకుంటున్నారు. ఇదంతా చూస్తే మనకు శని చాలని రోజులుగా కన్పిస్తున్నాయి. ఇటువంటి శని చాలని రోజులలోనే మనకు బుద్ధి చలిస్తూ ఉంటుంది. మనకు కర్తవ్యమేమిటో బోధపడక కంగారుపడుతూ ఉంటాము. ఎవరేమాటలు చెప్పితే, ఆ మాటలు విని భ్రమపడుతూ, భయపడుతూ ఉంటాము. కనుక, యీ సమయంలోనే మన బుద్ధిబలము మనకు చెడిపోకుండా, అసత్యమైన దేదో గ్రహించి, మనస్సు నిగ్రహించి, సత్యమైన దేదో గ్రహించి దానినే అనుసరించాలి.

వెనుకటి యుద్ధ కాలంలో రేడియోలు లేవు. కాని, యీ మహాసంగ్రామ కాలంలో రేడియోలు బయలుదేరాయి. జపానువాళ్ల రేడియోలో ప్రతి దినం మన మనస్సు చలించేటందుకుగాను అనేక విషయాలు చెప్పుతూ ఉంటారు. జర్మను రేడియోలో కొన్ని విషయాలు ప్రచారం చేస్తూ ఉంటారు. ఇటాలియను రేడియోలోకూడా ఏవో కొన్ని కబుర్లు చెప్పుతూ ఉంటారు. ఈ విధంగా అనేక దేశాల రేడియోలలో ఏవో కొన్ని ప్రచారాలు చేస్తూఉంటారు. కాని, ఈ రేడియో వార్తలన్నీ వింటున్నకొలదీ, మన మనస్సు పరి

పరివిధాలుగా చలిస్తూ ఉంటుంది. మనస్సుకు కంగారు ఎక్కువవుతూ ఉంటుంది. కాని, యిటువంటి కష్టసమయంలోనే, మనస్సు ఎక్కువ నిబ్బరంతో ఏకాగ్రచిత్తంతో చలనంలేకుండా పని చెయ్యాలి. మనస్సు చలించకుండా ఉండవలెనంటే ముఖ్యంగా చేయవలసిన పని ఏమిటంటే, ఇన్ని దేశాల రేడియోలు చెప్పే మాటలు వినకూడదు. మనము ఏకాగ్రచిత్తంతో " నమో నారాయణా " అన్నట్లుగా, ఒక్కరి మాటమీదనే పోవాలి. ఒక్కరి మాటనే నమ్ముకొని ప్రవర్తించాలి. ఇతర దేశాల రేడియోలను వింటూ ఉండడం పూర్తిగా మానివెయ్యాలి. ప్రస్తుతం మనలను పీడించుచున్న శని గ్రహం ఏదంటే, జపాను గ్రహం.

ఈ జపానువాళ్లు చేస్తున్న కుతంత్ర ప్రచారం ఇంతా అంతా కాదు. " ఆసియా ఖండవాసులనందరినీ, రక్షించి, వారికి విమోచనం కలుగజేయుటకొరకే మేము వస్తున్నాము " అనే మంత్రమొకటి జపానువాళ్లు ఉచ్చరిస్తున్నారు. ఇది శుద్ధ అబద్ధం. ఇది వట్టి మోసం. జపానువాళ్లు ఆక్రమించిన రాజ్యాలను దోచుకొని తింటున్నారు. తమచే ఆక్రమింపబడిన రాజ్యాలకు జపానుతోబాటు సమాన భాగస్వామ్యము కలుగజేస్తామని అంటున్నారు. ఈ మాటకు అర్థమేమిటి ? తాముకూడా ఆ రాజ్యాలను అనుభవిస్తాము అని అర్థము. బర్మాలో ప్రవేశించగానె బర్మాలోని బియ్యం యావత్తూ ఓడలమీద జపానుకు చేర్చుకుంటున్నారు. జావా ద్వీపమును ఆక్రమించినతోడనే అచటి ఫ్యాక్టరీలలో పనివాళ్లచేత (మధ్యాహ్నపు భోజనానికి వ్యవధి యివ్వకుండా) పనిచేయిస్తున్నారు. అక్కడ తయారైన చక్కెర యావత్తూ, చక్కగా జపానుకు రవాణా చేసుకుంటున్నారు. ఆక్రమించిన రాజ్యాలను ఉద్ధరిస్తామని రేడియోలో ప్రచారం చేస్తున్నారుకాని, అది వట్టి కల్ల. ఆ రాజ్యాలను పిల్చి పిప్పి చేస్తున్నారు. ఇండియానుకూడా ఉద్ధరిస్తామని ప్రచారం చేస్తున్నారు. ఈ మాయమాటలు చెప్పి మనలను తమ వలలో వేసుకోవలెనని ప్రయత్నిస్తున్నారు. ఈ మాటలవల్ల మనకు భ్రమ పుట్టించవలెననిన్నీ, మతి చలించేటట్లు చేయవలెననిన్నీ, మనం శత్రువులను ఎదిరించకుండా, స్వాగతమిచ్చినట్లయితే, సులభంగా యీ దేశాన్ని ఆక్రమించుకోవచ్చుననిన్నీ, వాళ్లు యీ దొంగ తారక మంత్రాలు జపిస్తున్నారు. జపానువాళ్లు ఉచ్చరిస్తున్న యీ తారక మంత్రాలు మనం వినడంవల్లనే మతి చెడి భ్రష్టుల మవుతాము.

ఈ జపాను శనిగ్రహ బాధ మనకు తొలగిపోవలెనంటే, నవగ్రహ జపాలు చేయించనక్కరలేదు. ఒక్కటే ప్రణవ స్వరూపం, ఒక్కటే " ఓం " కారమును లక్ష్యమందుంచుకొని, జపం చేసినట్లుగా ; శత్రువులు చెప్పే మాటలు "వినను". " విముక్తి " అనేది నేను స్థిరసంకల్పంతో మనసారా కోరి సాధించవలసినదేగాని, ఒకడు నాకు యిచ్చేదికాదు. " విముక్తి " అనేది శత్రు " విజయం " వల్లనే రావాలి. మనలోని అంతశ్శత్రువులను జయించనిదే ఆత్మవిముక్తి మనకు రాదు. దొంగస్వాములువచ్చి అరచేతిలో వైకుంఠం చూపించినప్పటికీ, అది నాకు లభించేది కాదు. అనే సంగతి ప్రతి భారతీయుడూ తప్పక గ్రహించాలి. " విముక్తి " అనేది " విజయం " వల్లనే రావాలి. " వి " అనే అక్షరం "విముక్తి" లోను, " విజయం " లోను నిర్వికారస్వరూపంగా ఉన్నది. అదే మనకు ప్రస్తుతం ప్రణవ స్వరూపం. దానినే లక్ష్యమందుంచుకొని స్థిరసంకల్పంతో ప్రతివాడూ నిత్యవిధిగా జపం చెయ్యాలి. యుద్ధ విజయమునకు తోడ్పడి, దుష్ట గ్రహ ప్రచారప్రభావమును ఆవిధంగా తొలగించాలి. విజయ మంత్రం జపించాలి. ఈ జపాలు దేశమంతటా చెయ్యాలి. అప్పుడు జపాను గ్రహం మనలను బాధించదు. ఈ జపమువల్ల భగవంతుని అనుగ్రహం పొందగల్గుతాము. జపాల అనుగ్రహంవల్లనే జపాను గ్రహమును జయించగల్గుతాము. విజయ మంత్రాక్షరమైన " వి " జపం నిరంతరంగా చెయ్యాలి. ఈ జపంవల్లనే ఆత్మనిగ్రహం సంపాదించి ఆత్మవిముక్తిని, స్వదేశ మోక్షమును సాధింపగల్గుతాము. మన విముక్తిని మనమే సాధించవలెను. మనకు విముక్తి అనేది జపానువాళ్లు యిస్తే వచ్చేదికాదు.

# జయించిన రాజ్యాలను జపాను పీల్చి పిప్పిచేయుట.

లండనులో ఇండియా హైకమీషనరుగా నున్న సర్ అజీజుల్ హెయిగుగారు ఈ మాసా రంభములో యీ క్రింది విషయములు కొన్ని వివరించి చెప్పియున్నారు :—

జపానువారు జయించి ఆక్రమించుచున్న రాజ్యములన్నియు జపానువారి సామ్రాజ్యంలో జపానుతో సరిసమాన భాగస్వామ్యంగల రాజ్యాలుగా ఉండగలవని జపానువారు ప్రకటించుచున్నారు. ఈ "సమాన భాగస్వామ్యము" అనే మాటకు అర్ధమేమిటంటే జయింపబడిన రాజ్యాలు జపానుకు లోబడిఉండి, తమ అయిశ్వర్యమును పాడిపంటలను యావత్తు జపాను యొక్క వినియోగానికే సమర్పించుకోవాలి— ఇప్పుడు జపానుచే ఆక్రమింపబడిన రాజ్యాలలో జరుగుచున్న పని యిదే—బర్మాలో వరిపంట ఎక్కువగా ఉన్నది. జపానువారు రంగూను చేరక పూర్వమే బర్మానుంచి బియ్యమును సమృద్ధిగా తీసికొనిపోవచ్చునని ఉవ్విళ్లూరుతూ ఉన్నారు. బర్మావారికి విదేశ ప్రభుత్వము నుండి విమోచన కలుగజేస్తామని జపానువారు ప్రకటిస్తూ వున్నారు. బర్మావారికి, జపానువారు విమోచనమార్గం చూపించినందుకు జపానువారిని అభినందిస్తూ ఏప్రిలు మాసారంభంలో జర్మను రేడియోలో గొప్పగా చెప్పబడెను. అయిరావతీ నదీ ప్రాంతములలోని గోధుమపంటను విశేషంగా జపానువారు బర్మాలో వశపరచుకొన్నారని ఇటాలియను రేడియోలో మార్చి నెల 21 వ తేదీని చెప్పబడెను. ఈ విషయం పరిషియాలోని వారికి చెప్పబడెను. పరిషియాలోని ప్రజలు జర్మను దురాశచూచి యిదివరకే ద్వేషపూరితులై యున్నారు. మొన్న నీమధ్యనే ఫ్రెంచి ఇండోచైనాలో జపాను అధికారమునకు లోబడియున్న సైగానులోని రేడియోలో ఇట్లు చెప్పబడెను. "చక్కెరయున్నూ, బియ్యమున్నూ ఇతర ఆహారపదార్థములున్నూ గల రెండు నావలు దక్షిణ సముద్రమునుండి జపానుకు చేరినవి. జపానుప్రజలు ఆనందభరితులైనారు." జపాను వారు ఆనందభరితులు కావచ్చును. కాని బర్మాలోని పంట యావత్తు హరించివేయుచూ, జపానువారితో సమాన భాగస్వామ్యమిస్తామని బర్మా ప్రజలకు వాగ్దానము చేయుచున్నారు. కనుక బర్మా ప్రజల గతి ఏమిటి?

ఇటలీలోకూడా వరి పంట ఎక్కువ. ఇటలీలో పండెడి వరిపంటలో అయిదవ భాగం జర్మనీకి రవాణాచేయబడుటకై ముడుపుకట్టినట్లుగా ప్రత్యేకింపబడుచున్నది. ఇటలీ సైన్యములకు ఖర్చు అయ్యేడి మొత్తముబియ్యమునకు రెండింతలుపంట జర్మనీకి సమర్పింపబడుచున్నది. ఇటలీ ఉత్తర ప్రాంతమంతటను జనులకు బియ్యమే భోజన ధాన్యంగా ఉంది. అచట 190 లక్షలమంది ప్రజల కదే ఆహారం. వారికందరికి కావలసిన పంటలో ముప్పాతిక వంతు వరి పంట జర్మనీ తీసికొనుచున్నది. జర్మనీకి, శత్రువైనా మిత్రుడైనా, స్వలాభ విషయం వచ్చినప్పుడు తారతమ్యంలేదు.

రష్యాలో జర్మనుసేనలు ప్రవేశించి అచటి గ్రామాలను లూటీచేసి దోచుకొనుచున్నవి. రష్యాలో టూలా పరగణాలలోని 25 జిల్లాలలో వున్న పశువులను, మేకలను, కోళ్లను ప్రజలు తీసికొనివచ్చి జర్మను అధికారులకు దాఖలుచేయవలసినదని జర్మనుసేనాని ఉత్తరవు జారీచేసాడు. 1,40,008 ఆవులను, 28,450 గొఱ్ఱెలను, 2,13,678 కోడిపిల్లలను, బాతులను యీ విధంగా ప్రజలవద్దనుండి తెప్పించుకొన్నారు. ఆ జిల్లాలలోని 25,000 తేనెపట్టులను జర్మను సైనికులు బుద్ధిపూర్వకంగా ధ్వంసంచేసారు. అచట నున్న జర్మనుసేనానియగు లెఫ్టినెంటు జనరలు బీరుగారు యీ క్రింది రీతిగా ఒక ఉత్తరువును జారీచేసారు :—"ప్రజలవద్దనున్న నిల్వ సరకుల నన్నింటిని, జర్మనులు పట్టుకొన్నారు. కనుక, వాటిని జర్మను అధికారులకు సమర్పించవలెను. ఈ ఉత్తరువును ఉల్లంఘించినవారు అప్పటికప్పుడు వెంటనే తుపాకీతో కాల్చివేయబడుదురు."

ఈ విధంగా, ఆక్రమించిన రాజ్యాలలోని వస్తుసంపదనంతను దోచుకొని తినడం, జపానువారికి, జర్మనీవారికి, చాలా స్వల్ప విషయంగా కన్పిస్తోంది. కాని, యీ గోముఖవ్యాఘ్రములు అయిరోపా ఖండములో గావించుచున్న ఘోర దుర్మార్గములను చిరకాలము కప్పిపుచ్చజాలరు.

# జర్మనులపై, ఇటాలియనులపై అరబ్బుల ద్వేషము.

అరబ్బులకు నాజీ జర్మనులయెడల ద్వేష మున్నది. వారంటే భయంకూడా ఉన్నది. ఇటాలియను ఫాసిస్టులంటే భయంలేదుగాని ద్వేషం ఉన్నది. అబిసీనియాలో ఇటాలియను ప్రభుత్వ ప్రతినిధిగానుండిన గ్రాజియానీ, ఇది వరలో అచటి అబిసీనియావాసులగు సెన్యూసీ షేకులను విమానాలమీదకెక్కించి వారి గ్రామాలలో వారిని ఆ విమానాలనుండి క్రిందికి ఆకాశంనుండి భూమిమీదకు పడద్రోయించినాడు. అబిసీనియనులపై బాంబులువేయించి వారిని భస్మం చేయించాడు. వాళ్లు కళ్లుపోయి, కాళ్లుపోయి వికలాంగులైనారు.

హిట్లరుచేయుచున్న అనేక క్రూరకార్యములను గూర్చి అరబ్బులు అనేక వార్తలు కర్ణాకర్ణిగా వినుచున్నారు. మిత్రమండలివారు రేడియోలో ప్రకటించిన యీ క్రూర కార్యములనుగూర్చి వినుచున్నారు. గ్రీసులోను, యుగోస్లోవియాలోను జర్మనుల క్రూర చర్యలను కండ్లారచూచినవారు కొందరు అరాబియా దేశానికి వచ్చి వర్ణించి వివరించి చెప్పుచున్నారు. ఈ రాక్షస కృత్యముల గాథలను అరబ్బులు విని, “ఆ జర్మనులు అటువంటివి మాకు ఏమిన్నీ చేయలేదు” అని అంటున్నారు.

గ్రాజీయానీచేసిన క్రూర కార్యములకన్నింటికీ ప్రతిక్రియగా, ముసులోనీ కొంత పటాటోప నాటకము ను ఆడించుటకుగాను, గుర్రముమీద ఎక్కి కత్తి తిప్పుతూ మహమ్మదీయ లోకమునంతటిని రక్షించుటకు తాను కత్తిచేపట్టియున్నానని జనానికి చూపించెను, కాని మహమ్మదీయులు యీ ఆర్భాటమును చూచి మోసపోలేదు. తమకు మహమ్మదీయ లోకమును రక్షించేటందుకు మహమ్మదీయుడే రక్షకుడుగా ఉండవలెనన్నారు. మహమ్మదీయేతరుడే ఉండవలసినయెడల, ముసులోని కాకుండా ఇంకెవరైనా ఉండుటకు అంగీకరిస్తామన్నారు. ఇప్పుడు సెన్యూసీ పటాలములు సయ్యిదు ఇద్రీస్ అల్ సెన్యూసీగారి నాయకత్వమున బ్రిటిష్‌వారి పక్షమునచేరి, ఇటాలియనుల యెడ పగ సాధించుకోవలెననే స్థిరసంకల్పముతో పోరాడుచున్నవి.



MADRAS : PRINTED AND PUBLISHED BY THE SUPERINTENDENT, GOVERNMENT PRESS.